Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యుం I.] మద్రాసు : 1941 వ సం॥ జూలై నెల 4 వ తేది శుక్రవారం [నె 16 రు

## ఈ వారంలో యుద్ధ వార్తలు.

### విమాన దాడులు.

ఈ వారము బ్రిటనుపై జర్మను విమానదాడులు చాల తగ్గినవి. బ్రిటిషు విమాన దళముమాత్రము జర్మనీపైనను, ఆక్రమిత దేశములపైనను, బహు భయంకరమైన దాడులు సాగించుటకు ప్రారంభించినది. 25 వ తేది బుధవారము రాత్రి జర్మనీలోని కీలు, బ్రెమెన్ రేవులపైనను అచటి నౌకా నిర్మాణశాలలపైనను వర్షించిన అగ్ని బాంబులవల్ల అనేక చోట్ల బ్రహ్మాండమగు అగ్నిజ్వాలలు లేచినవి. ఈ దాడులలో 250 నుండి 400 విమానములవరకు పాల్గొనినవి. గురువారం ఉదయం మంచుదట్టంగా పడుచున్నను బ్రిటిషు విమానాలు పరాసుకోస్తా రేవులపైన దాడులు సాగించినవి. అక్కడ జర్మను "ఫైటరు" విమానాలకు బ్రిటిషు విమానాలకు చాల పోరాటములు జరిగినది. 9 జర్మను విమానములు ధ్వంసంచేయబడెను. వానితో—అంతకుముందు ఆరు రోజులలోను—ఫ్రాన్సుమీద పడగొట్టబడిన జర్మను విమానాల సంఖ్య 108 అయినది. బ్రిటిషు విమానాలు 19 నష్టమైనవి. రష్యాపై సాగించుచున్న నౌకా దాడులకు జర్మనులు కీలు రేవును కేంద్రంగా నుపయోగిస్తున్నారు. అందువల్ల గురువారం రాత్రి మరల క్రొత్త రకపు పెద్ద విమానాలను బ్రిటిషు అధికారులు కీలు రేవుపైకి పంపిరి. ఈ దాడిలో 2 జర్మను "ఫైటరు" విమానాలు పడగొట్టబడెను. జర్మను విమానాల ప్రతిఘటన యిదివరకు కంటె చాల తగ్గినది. పోలండు వైమానికులు ఫ్రాన్సు వుత్తర భాగంలోని పారిశ్రామిక ప్రదేశాలపై దాడి సాగించి మూడు శత్రువిమానాలను ధ్వంసంచేసిరి. 27 వ తేదిన జరిపిన దాడులనుండి 12 విమానాలు తిరిగిరాలేదు. శనివారమునాడు జర్మనీపై జరిపిన దాడులలో 9 జర్మను విమానాలు పడగొట్టబడెను. ఆ రాత్రి బ్రెమన్ రేవు పట్టణం మరల బాంబుల అగ్ని వర్షమునకు గురిచేయబడింది. ఆదివారంనాడు ఫ్రెంచి తీరముపై నంతటా వందలకొలది బ్రిటిషు విమానాలు విహరించి సావకాశముగ బాంబులు వర్షించినవి. వానిని యెదుర్చుటకు వొక్క శత్రు విమానమైనను రాలేదు. 30 వ తేదిన పట్టపగలుకూడ వందలకొలది బ్రిటిషు విమానములు జర్మనీపైకి చాల దాడులు జరిపి బ్రెమెన్, కీలు రేవునందలి నౌకా నిర్మాణశాలలపైనను, ఇతర పారిశ్రామిక పట్టణముల పైనను బాంబులు వర్షించెను. అవి చాల నష్టముగల్గించినటుల జర్మనులుగూడ అంగీకరించిరి. బ్రెమెన్ రేవులో రెండు పెద్ద నౌకలు ముంచివేయబడెను. జర్మనులు యుద్ధ నౌకాశ్రయముగ నుపయోగించుకొనుచున్న బ్రెస్టు రేవుపై వేల కొలది బాంబులు వర్షించినవి. 2[illegible] తేదిన మెర్విలీ (ఫ్రాన్సు) యందలి విమానాశ్రయము ధ్వంసమొనర్పబడెను.

26 వ తేదిని చాలకొద్ది శత్రు విమానములు మాత్రమే బ్రిటనుపైకి వచ్చినవి. తూర్పు ఆంగ్లియా జిల్లాలో అచ్చటచట స్వల్పముగ బాంబులు వేసినవిగాని, ఆస్తికి ప్రాణములకు యెట్టి నష్టము కలుగలేదు. మరునాడు శుక్రవారంనాడు ఒక్క విమానంమాత్రంవచ్చి, స్కాట్లండు తూర్పు ప్రాంతంలో బాంబులువేసి పోయినది. దానివలన చాల స్వల్పమగు నష్టముమాత్రమే కలిగింది. శనివారంనాడు ఇంగ్లండు తూర్పు భాగంలోని కొలది విమానాలు వచ్చినవి. వాని బాంబులవలన స్వల్పంగా నష్టముగలిగింది. ఆదివారంనాడు అసలు దాడులే లేవు.

మధ్య ప్రాచ్యంలోను, ఐరోపాలోను కల గత వారంలో 183 విమానములు పడగొట్టబడెను. బ్రిటిషు విమానములలో 65 వరకు నష్టపడినవి.

### ఆఫ్రికా - మధ్యధరా.

ఉత్తర ఆఫ్రికాలో (లిబియా) టొబ్రూకు దుర్గంలో పరిస్థితులేమీ మారలేదు. అవకాశం కలిగినపుడెల్ల దుర్గంలోని బ్రిటిషు సైన్యములు దాడుల నన్నిటినీ తిరుగగొట్టుటయే గాక, తామే శత్రులపైబడి చాల నష్టముగలిగించుచున్నారు.

అబిసీనియాలో బ్రిటిషు సైన్యములు 27 వ తేదిన డిడెస్సానదిని దాటి పడమటి తీరమునగల ఇటాలియను శిబిరములపైబడెను. 28 వ తేదిన బ్రిటిషు సైన్యములు జిమ్మానుండి ముందుకు సాగిపోయి డెన్బి అను పట్టణమును ఆక్రమించినది. అక్కడ 600 ఇటాలియను సైనికులు 100 ఆఫ్రికనులు ఖైదీలుగ పట్టుబడిరి. 29 వ తేదిన గింబీదుర్గము గూడ బ్రిటిషు వశమయ్యెను. ఇటాలియను సేనానియగు జనరలు బెర్టిలో, జనరలు నాం, టోస్లిసేనోలు చాలమంది చిన్న ఉద్యోగులతోను 3,000 సైనికులతోను ఖైదీలుగ పట్టుబడిరి.

ఇటాలియను విమానములు, మాల్టాదీవిపై దాడులను అధికమొనర్చెను. 25 వ తేదిన 3 శత్రు విమానములు కూల్చివేయబడెను.

ఇటలీకి దక్షిణముగా, యుద్ధనౌకల రక్షణతో బ్రిటిషు విమానాలు 27 వ తేదీన ప్రయాణమొనర్చుచున్న ఇటాలియను సరకుల నౌకలను యెదిర్చి 20 వేల టన్నుల నౌకలను ముంచివేసెను.

28 వ తేది ఉదయం అలెగ్జాండ్రియా రేవుపైన జర్మను విమానములు దాడి జరిపినవి. ఎక్కువ ఆస్తి నష్టం కలుగలేదు కాని కొందరు ప్రజలు హతులైరి.

బ్రిటిషు విమానములు లిబియాలోని బెంఘాజీ రేవుపైనను టొబ్రూకు రేవుపైనను గూడ, బ్రిటిషు విమానములు పెద్ద దాడుల సాగించుచుండెను. గురువారమునాడు గజాలాపై సాగించిన దాడిలో 12 శత్రు విమానములు ధ్వంసమొనర్పబడెను.

### రష్యా.

రష్యాపై జర్మనీ, ఇటలీలేగాక, అక్ష రాజ్యముల నాశ్రయించుకొనియున్న మరికొన్ని యితరదేశములు గూడ ఈ వారము సోవియటు రష్యాపై యుద్ధము ప్రకటించినవి. సోవియటు విమానములు తమ పట్టణములపైన దాడివచ్చి బాంబులు వేయుచుండుటచే ఆత్మరక్షణకొరకు సోవియటు రష్యాపై యుద్ధమును సాగించుటకు నిశ్చయించితిమని ఫిన్లండు

ప్రభుత్వము ప్రకటించెను. తరువాత హంగేరీ, అల్బేనియా, స్లోవాకియా దేశములు గూడ రష్యాపై యుద్ధము ప్రకటించెను.

బ్రిటిషు రాయబారియగు సర్ స్టాఫర్డు క్రిప్సుగారును, రష్యాకు సహాయముగ పంపబడుచున్న యుద్ధ శాస్త్ర నిపుణులును 27 వ తేదిన మాస్కో చేరిరి. మాలటావుగారు (రష్యా) విదేశాంగమంత్రివారి కాహ్వానమొసగి తీసుకొని పోయిన సంప్రదించెను.

25 వ తేది బుధవారమునాడు, సోవియటు విమానదళము, బాల్టికు రాష్ట్రముల ప్రాంతంలో జర్మను సైనిక ప్రవాహముపై తీవ్రమగు దాడులు జగిపి అపారమగు నష్టము కల్గించెను. రష్యా ఆక్రమితమగు దక్షిణ పోలండులో ల్వోవ్ పట్టణ ప్రాంతమున సోవియటు సైన్యములు జర్మనుల నెదిర్చి వెనుకకు కొట్టెను. రుమేనియా సరిహద్దులలో సోవియటు సైన్యములు జర్మనుల పూర్తిగ నిరోధించి ప్రూత్ నదిని దాటి రాకుండ పూర్తిగ తిరుగగొట్టెను. 26 వ తేదిన సోవియటు విమానములు, రుమేనియాలో పెట్రోలు యంత్రాలయములుగల బుఖారెస్టు నగరముపైనను, పాలెసీ నగరం తీవ్రమగు దాడుల జరిపి అచటి నూనె యంత్రాలయముల పూర్తిగ ధ్వంసమొనర్చెను. ఈ దాడులచే రుమేనియా ప్రభుత్వం బుఖారెస్టును ఖాళీచేసి 26 వ తేదిన రాజధానిని మరియొక ప్రాంతమునకు మార్చుకొనిరి. బాల్టికు సముద్రంలో రష్యను విమానములు రెండు శత్రు జలాంతర్గాముల ముంచివేసెను. జర్మను అధికారులుగూడ పోరాటము కడు తీవ్రముగనున్నదని అంగీకరించిరి. శుక్రవారమునాడు జర్మను సైన్యములు పోలండు సరిహద్దులదాటి, రష్యాలో "మిన్స్క్" దుర్గమువైపునకు సాగివచ్చుచుండిరి. దక్షిణ పోలండుమీదుగా రష్యాలోని యుక్రేనియా ప్రధాన పట్టణమగు కీవు నగరముపైకి జనుచున్న జర్మను సైన్యములు ల్వోవ్, లక్ నగర ప్రాంతములలో, రష్యనులచే నిలిపివేయబడెను. విల్నా (బాల్టికు) రంగములో సోవియటు సైన్యములు వెనుకకు తగ్గవలసివచ్చెను. శనివారమునాడు చాలమంది రష్యను ఆకాశయోధులు రుమేనియాలో దిగిరనియు వారిలో చాలభాగము ఖైదీలుగ పట్టుకొనబడిరనియు జర్మను అధికారులు ప్రకటించిరి. ఆదివారమునాడు జర్మను అధికారులు మొదటివారపు యుద్ధఫలితముల ప్రకటించుచు మిన్స్క్ ప్రాంతమున రష్యనులు వెనుకకు కొట్టబడిరనియు ఈ పోరాటములో 4,000 రష్యను విమానములు, 2,233 టాంకులు, 40 వేల సైనికులు జర్మనులచే జిక్కిరనియు ప్రకటించిరి. తమకు 150 విమానములు పోయినవనిరి. బాల్కను ప్రాంతములో డుడ్నా నదిని చాల ప్రదేశములలో దాటి ఉత్తర తీరమునుగూడ ఆక్రమించితిమని వెల్లడించిరి. ఇవియన్నియు డాబులనియు తమవి 900 టాంకులు 500 విమానములు మాత్రమే పోయెననియు 30 వేల మంది జర్మనులు ఖైదీలుగ చిక్కిరనియు సోవియటు అధికారుల ప్రకటించిరి. మిన్స్క్ ప్రాంతమున ఉభయపక్షములకు జరుగుచున్న పోరాటమున 4,000 టాంకులుపయోగింపబడుచున్నవని సోవియటులు తెలిపిరి. మిన్స్కును పట్టుకొని, అక్కడనుండి మాస్కో వైపునకు తమ సైన్యములు నడచుచున్నవని జర్మనులు ప్రకటించిరి. దక్షిణ పోలండులోని లింబర్గు పట్టణమును బాల్టికు రాష్ట్రములందలి లిబారేవును వుండ్లారేవును ఆక్రమించితిమని జర్మనులు 30 తేదిన ప్రకటించిరి.

విబర్గు రేవులో సైన్యముల దింపుటకు జర్మనులు ప్రయత్నించిరనియు వానిని తిరుగగొట్టితిమనియు రష్యను అధికారులు తెలిపిరి. దక్షిణ పోలండులో "నిలక్" నగరమును ఆక్రమించితిమని జర్మనులు ప్రకటించిరి. ఈనెల 1 వ తేది రాత్రి మాస్కో నగరంమీద మొదటి విమానదాడి జరిగెను. ఎక్కువ నష్టం మాత్రం జరుగలేదు. జర్మను దాడిని నిరోధించుటకుగాను జూలై 1 వ తేదిన స్టాలిన్‌గారి అధ్యక్షతను దేశరక్షణ మంత్రివర్గమొకటి యేర్పడెను. దానికి, సర్వాధికారములును ఒసగబడెను. 30 వ తేదిన బాల్టికులలో రీగారేవును పట్టుకొంటిమని జర్మనులు వెల్లడించిరి.

బాల్టికు సముద్రంలో రష్యనులు 7 జర్మను జలాంతర్గాముల ముంచిరి.

బియాలిస్టక్ ప్రాంతములో లక్షమంది రష్యను సైనికులను 400 టాంకులను, 300 పెద్ద ఫిరంగులను పట్టుకొంటిమని 2 వ తేదిన జర్మనులు ప్రకటించిరి.

### టర్కీ—ఈరాక్—ఈరాన్.

టర్కీ—జర్మనీ ప్రభుత్వములు గావించుకొని మైత్రి యొడంబడికను, టర్కీ శాసనసభవారు జూన్ 25 వ తేదిని ఆమోదించి ధృవపరచిరి. ఆ సమయమున, టర్కీ విదేశాంగ మంత్రి శాసనసభలో ప్రసంగించుచు, ఈ యొడంబడిక వలన టర్కీకి ఇదివరకు ఇతర దేశములతోగల యొడంబడికలకు అందు ముఖ్యముగ టర్కీ—బ్రిటిషు మైత్రి యొడంబడికకు యే విధముగను భంగము గలిగింపదనియు, ఆ విషయమును ముందు స్పష్టపరచిన పిమ్మటనే టర్కీ ప్రతినిధులీ యొడంబడికను ఏర్పరుచుకొనిరనియును ప్రకటించెను. అలెగ్జాండ్రియాకు పోవుచున్న రెఫాఅను టర్కీ ప్రయాణీకుల నౌకను 25 వ తేది రాత్రి ఏదో జలాంతర్గామి ముంచివేసెను. బహుశా అది ఇటాలియను జలాంతర్గామియని అనుకుంటున్నారు. ఇది టర్కీలో చాల ఆగ్రహమును గలుగజేసెను. విషీ ప్రభుత్వ మంత్రులలో నొకరగు బెనోయిమెసిన్‌గారిని, 25 వ తేదిన టర్కీ రాజధానియగు అంకారాయందు విమానమున దిగిరి. పెటెయిన్ సేనాని మెసిన్‌గారిద్వారా టర్కీ అధ్యక్షులగు ఇనూనుగారి కొక ప్రత్యేక సందేశమును పంపిరి. మెసిన్‌గారు 27 వ తేదిని టర్కీ ప్రధాన మంత్రినిచూచి సంభాషించెను. టర్కీ పరిసరదీవుల యందు విహార మొనర్చుచున్న ఇనూనూగారు తన విహారమును వదలుకొని 29 వ తేదిన అంకారాకు తిరిగి వచ్చెను. టర్కీగుండ సిరియాలోని ఫ్రెంచి సైన్యములకు సహాయమును, ఆయుధసామగ్రిని పంపుటకు అనుమతిని గోరుటకుగాను మెసిన్‌గారు వచ్చినటుల వదంతులు వ్యాపించుచున్నవి.

ఈరాక్‌లో చేరియున్న, ఈరాక్ తిరుగబాటుదారులు, తాము బసచేసియున్న "హోటల్సు"ను వదలి ప్రైవేటు గృహములను అద్దెకు దీసుకొని వానిలో నుండవలెననియు హోటలులందుండరాదనియు ఉత్తరువుచేసిరి. వీరిపై పోలీసు 'నిఘాను' హెచ్చించి జాగ్రత్తగ కనిపెట్టియుంచుటకుగానీ యుత్తరువు గావింపబడెనని తెలియుచున్నవి.

ఈరాక్‌ను ప్రభుత్వమును రష్యా బెదరించుచున్నదని జర్మనులు వ్యాపింపజేయుచున్న వదంతులు కేవలము నిరాధారములైనవనియు, ఈరాక్-రష్యా సంబంధములు చాల అన్యోన్యముగనున్నవనియు, సోవియటు రేడియో ద్వారా రష్యను అధికారులు ప్రకటించిరి. సోవియటు అధికారులు, స్మిర్నోవ్‌గారిని ఈరాన్‌లో తమ రాయబారిగ నియమించిరి.

డార్డెనల్సును, బల్గేరియాను ఆక్రమించుకొనుటకు సోవియటు అధికారులుద్దేశించిరని జర్మనులు వ్యాపింపజేయు

చున్న వదంతులు అబద్ధములనియు, తా మెపుడునుగోరి యుండలేదనియు సోవియటు అధికారులు ప్రకటించిరి.

## తటస్థ రాజ్యములు.

మాడ్రిడు (స్పెయిను రాజధాని) నగరమున, ప్రజలు బ్రిటిషు రాయబారి కార్యాలయము యెదుట 25 వ తేదీన జరిపిన ప్రతికూలార్భాటములకు, బ్రిటిషు రాయబారి తీవ్రమగు ఆక్షేపణను దెలిపి, స్పెయిను ప్రభుత్వమును హెచ్చరించెను. 28 వ తేదీన ఫ్రాంకో సేనాని, బ్రిటిషు రాయబారితో మాటలాడుచు, ఈ ప్రతికూలార్భాటములను తమ ప్రభుత్వము తీవ్రముగ నిరసించినదనియు, నేరస్థులు శిక్షింపబడుదురనియు దెలిపి ఇకమీద నిట్టివి జరుగవని వాగ్దాన మొనర్చిరి.

స్పెయినుకు నూనె దిగుమతులకు బ్రిటిషు నౌకాధికారులు అనుమతి పత్రములను రద్దుచేసిరను వదంతి అసత్యమని బ్రిటిషు అధికారులు ఖండించిరి. స్పెయిను ప్రభుత్వ మంత్రులలో నొకరును ఫలాంగ్ పక్షనాయకుడను అగు సీనర్ అర్రెసీగారు రష్యాపై యుద్ధమున పాల్గొనుటకుగాను, వాలంటీయరులుగ జేరవలసినదని ప్రజల నుద్బోధించిరి.

అయిర్లండునకు ఆయుధ సామగ్రిని పంపు విషయమై తా నాలోచించుచుంటిననియు, కాని మందుగుండు సామానును పంపుటకు మాత్రము అవకాశము లేదనియు, సంయుక్త రాష్ట్ర అధ్యక్షుడగు రూజ్వెల్టు ప్రకటించెను. అయిర్లండు ప్రభుత్వాధ్యక్షుడగు డివెలరాగారు ప్రసంగించుచు, రోజులు గడచిన కొలదియు అయిర్లండునకు దాడి అపాయ మధికమగుచున్నదనియు, ప్రజ లిప్పటినుండియు నందుకు సిద్ధపడి యేర్పాటు లొనర్చుకొనవలెననియు హెచ్చరించిరి.

నార్వేనుండి ఫిన్లండు యుద్ధరంగమునకు పోవుటకు జర్మను సైన్యములకు స్వీడను ప్రభుత్వము అనుమతి నొసగుట, తాటస్థ్యమునకు విరుద్ధమని, బ్రిటిషు ప్రభుత్వము స్వీడనును 26 వ తేదీన హెచ్చరించెను. పాఠశాలలలోని విద్యార్థులందరకును నిర్బంధముగ సైనిక శిక్షణ మొసగుట కుద్దేశింపబడిన శాసనములను స్వీడను శాసన సభవారు 26 వ తేదీనా మోదించిరి. తమ తాటస్థ్యరక్షణార్థము, స్వీడను దేశతీర సముద్రప్రాంతములలో మందు గనులు మాటుపెట్టబడెనని స్వీడను నౌకాశాఖాధికారులు ప్రకటించిరి.

## అమెరికా సంయుక్త రాష్ట్రములు, అట్లాంటిక్.

సోవియటు అధికారులు, అమెరికా సంయుక్త రాష్ట్రములనుండి ఇంకను ఎట్టి సహాయమును గోరియుండలేదని సంయుక్త రాష్ట్ర దేశీయాంగ సహాయ కార్యదర్శియగు సమ్నరు వెల్సుగారు 26 వ తేదీన ప్రకటించిరి. సోవియటు రాయబారియగు జోమనస్కీగారు 27 వ తేదీ రాత్రి సమ్నరు వెల్సుగారిని దర్శించి జర్మనుదాడిని గురించి తెలిపిరి. రష్యా వి సహాయముకోరినను సాధ్యమైనంతవరకు పూర్తిగ నొసగుటకు సంయుక్త రాష్ట్ర ప్రభుత్వము సిద్ధముగనున్నదని వెల్సుగారు వాగ్దాన మొనర్చిరి.

సంయుక్త రాష్ట్ర నౌకాదళ శాఖవారు గత సంవత్సరారంభమునుండి యింతవరకు 72,340 లక్షల డాలర్ల ఖర్చుతో 2,831 నౌకల నిర్మించుటకు ఉత్తరువుల గావించిరి. అందులో 775 నౌకల నిర్మాణము పూర్తియయ్యెను. ప్రస్తుతము సంయుక్త రాష్ట్ర నౌకా నిర్మాణశాలలలో 14 పెద్ద యుద్ధ నౌకలు, 24 జలాంతర్గాములు, 44 డిస్ట్రాయరులు నిర్మింపబడుచున్నవి. ప్రైవేటు నౌకా నిర్మాణశాలలలో మరి 3 పెద్ద యుద్ధ నౌకలు, 12 విమానవాహక యుద్ధ నౌకలు, 152 డిస్ట్రాయరులు, 14 పెద్ద క్రూయిజరులు, 43 చిన్న క్రూయిజరులు, 51 జలాంతర్గాములు నిర్మింపబడుచున్నవి. అవిగాక మరి 8,940 లక్షల డాలర్ల ఖర్చుమీద, మరి 2,236 విమానములను, 19 చిన్న నౌకలను 7 సైనికుల రవాణా నౌకలను నిర్మించుటకు శాసనసభవారు సొమ్మును మంజూరుచేసిరి. సైనిక ఆవశ్యకతలకొరకు 1,038 కోట్ల డాలర్లను, సంయుక్త రాష్ట్ర శాసనసభవారు 28 వ తేదీన మంజూరుచేసిరి. దీనిలో -- సైనికశాఖకు 13 వేల విమానముల నిర్మించుటకుగూడ ఏర్పాటుగలదు.

ఆకాశంలో సైనికులను తీసుకొనిపోగల 103 పెద్ద విమానములు, ఇంతవరకు అమెరికాలోని కంపెనీలు బ్రిటనుకు అందజేసెననియు, త్వరలోనే ఇంకనుచాల, అందజేయబడుననియు ఎడ్వార్ గోర్రెలేగారు తెలిపిరి.

"నేషనలు ఎమర్జెన్సీ" ఏర్పడినటుల ప్రకటింపవలసినదని శాసనసభలను గోరుటకు సంయుక్త రాష్ట్ర అధికారులు శనివారమునాడు నిశ్చయించుకొనిరి. శాసన సభలీ ప్రకటనను గావించునెడల, సంయుక్త రాష్ట్ర సైన్యముల నితర దేశములకు పంపుటనుగూడ రూజ్వెల్టు అధ్యక్షునకు అధికారము లభించును.

సంయుక్తరాష్ట్రములలో జర్మనుల సొమ్ముల బందుచేసినందుకు ప్రతీకారంగా జర్మనీ అధికారులు 25 వ తేదీన, తమ దేశముననున్న అమెరికనులు తమ ఆస్తులను సొమ్మును జర్మను అధికారుల అనుమతిలేనిది విక్రయించుకొనరాదని నిషేధించిరి.

## విషీ.

ఫ్రాన్సునందాక్రమించియున్న జర్మను సైనిక ఖర్చుల క్రింద విషీ ప్రభుత్వము చెల్లింపవలసిన మొత్తమును యింతవరకువలె సరకులలోగాక, బంగారురూపమున చెల్లింపవలసినదని జర్మను అధికారులు వత్తిడిచేయుచున్నారు. జర్మనీతో సహకార మొనర్పగోరువారికిగూడ, ఈ వత్తిడి చాల అసంతృప్తిని కలుగచేయుచున్నది. ఫ్రాన్సును ఆక్రమించినపుడు రేవులలో ఖైదీలుగా పట్టుబడిన వారిలో 10 వేలమంది నావికులను విడుదలచేయుటకు జర్మనీ అంగీకరించెను. ఈ నావికులు, ఫ్రెంచి వర్తక నౌకలలో పనికి ఉపయోగింపబడెదరు.

ఫ్రాన్సు గత వత్సరమున ఓడిపోవుటకు పూర్వము ఆంగ్లపరాసు సైన్యములకు సర్వసేనాధిపతిగనున్న గామ్లిన్ సేనాని, విషీ అధికారులచే అరెస్టుచేయబడి కారాగారమునందుంచబడెను. అతడు ఇపు డెచటకో తప్పించుక పారిపోయెనని జర్మనులు వ్యాపింపజేసిన వదంతులు నిరాధారమైనవని ఫ్రెంచి అధికారులు ప్రకటించిరి.

విషీ ప్రభుత్వము, సోవియటు రష్యాతో రాజ్యాంగ సంబంధముల తెంపివేసుకొని, సోవియటు రాయబారిని తమ దేశమునుండి వెడలిపొమ్మని ఉత్తరువుచేసిరి.

సిరియాలో, ఫ్రెంచి సైన్యముల (విషీ) ప్రతిఘటన రాను రాను హెచ్చుచున్నది. అందుచే మిత్రమండలి పురోగమనము మెల్లగా సాగుచున్నది. మెజ్జా అయుం ప్రాంతలో బ్రిటిషు సైన్యములు 25 వ తేదీన ఆక్రమించుకొనిన ప్రాంతముల బలపరుచుకొనినవి. బ్రిటిషు నౌకాదళమును పెద్ద ఫిరంగులును కలసి డామూరు రేవుపై అగ్ని గుండ్లను వర్షించెను. ఆ రోజున జర్మను విమానములు డమాస్కసు పైనను ఏకరు పట్టణము పైనను తీవ్రమగు దాడిని సాగించెను.

26 వ తేదీన బ్రిటిషు సైన్యములు స్వతంత్ర ఫ్రెంచి సైన్యములు డమాస్కసు నగరం దాటి ఉత్తరము 36 దూరమున నున్న కాస్టరు పట్టణమును సమీపించిరి. 27 వ తేదీన

## యుద్ధములో జయించడానికి చేయు కార్యములు.



బారులు తీరియుండు వీరు బ్రిటిషు సామ్రాజ్యము తరఫున వాయు విమాన శిక్షణ పొందుటకుగాను నియమించబడిన వారు. వీరు శిక్షణ పూర్తిచేసుకొనుటకుగాను ఆస్ట్రేలియానుండి కానడా దేశమునకు వెళ్లుచున్నారు.

ప్రపంచములోని అన్ని భాగములనుండి ఈ శిక్షణ పొందుటకు మనుష్యులను తీసుకుంటున్నారు. ఇట్లు తయారుచేయడమువల్ల కొద్ది కాలములోనే బ్రహ్మాండమైన వాయు విమానదళము ఏర్పడుతుంది.

నెబ్రూక్ పట్టణము ఆక్రమింపబడెను. శత్రు ప్రతిఘటన అధికమగుటచే బేరూట్ రేవువైపునకు మిత్రమండలి పురోగమనము మందమగుచున్నదని, బ్రిటిషు అధికారులు 29 వ తేదిన ప్రకటించిరి. డెమాస్కసు ప్రాంతములో మాత్రము సాచాబి యారే మొదలగు మరికొన్ని పట్నములాక్రమింపబడెను.

జర్మనులు సిరియాలో తమ చర్యల నింకను వదలలేదు, కొందరు జర్మను యుద్ధనిపుణులు టర్కీగుండ 28 వ తేదిన సిరియాకు వెళ్లిరి.

విషీ ప్రభుత్వపు ఉత్తరవులవలన సిరియాలో పనిచేయుచున్న నలుగురు ఫ్రెంచి సేనానులు తమ పదవులనుండి తొలగింపబడిరి. పారిస్‌లో జర్మను ప్రతినిధియగు ఎబెట్జుగారు 25 వ తేదిన బర్లినువెళ్లిరి. సిరియాలో విషీ సైన్యముల స్థితి చాల దుర్భరముగ నున్నదని, విషీ యధికారులు తెలిపిన వివరములను జర్మను అధికారులకు అందజేయుటకుగాని అతడు యీ ప్రయాణమును తలపెట్టెనని వదంతిగనున్నది.

సిరియాకు స్వాతంత్ర్య మొసగబడెననియు సిరియా ప్రజలిక తమ కుచితమని తోచిన రాజ్యాంగము నేర్పరుచుకొనవచ్చుననియు, స్వతంత్ర ఫ్రెంచినాయకుడగు డిగాలీ తరఫున కాట్రూ సేనాని ప్రకటించెను.

### దూరప్రాచ్యము.

రష్యా జర్మనీ యుద్ధము ప్రారంభమగుటవలన జపాను ప్రభుత్వ మీస్థితిలో తామెట్టి విధానమును అనుసరింపవలసినదియు నిశ్చయించుకొనజాలకున్నారు. అందుచే, చైనా యుద్ధరంగములలో యుద్ధ కార్యక్రమము అట్లే నిలచిపోయినది అని చైనా సైనికాధికారి యొకరు 26 వ తేదిన ప్రకటించెను.

జపానులో మంత్రివర్గమువారు సైనిక శాఖాధికారులను అందరను సమావేశపరచి, కర్తవ్యమునుగురించి ప్రతిదినము సమాలోచనల జరుపుచుండిరి. 26 వ తేదిన అట్టి సమావేశము జరిగిన పిదప ప్రభుత్వాధికారియొకరు మాటలాడుచు రష్యా జర్మను సంగ్రామమును గురించి ప్రస్తుతమున కెట్టి ప్రకటనయు గావింపబడదని తెలిపెను.

అక్సిసు రాజ్యము పలుకుబడి రష్యాలో ఐరోపా సరిహద్దగు యూరలు పర్వత పంక్తుల దాటి ఆసియాలోనికి వ్యాపించునెడల చాల ఉపద్రవ కరమగు పరిస్థితు లేర్పడుననియు అక్సిసు రాజ్యములు ఇండియా, ఆస్ట్రేలియా, పర్షియా, ఇరాకు, సౌదీ ఆరేబియాలపై జపాను నాయకత్వమును అంగీకరింపవలెననియు కొకుమిన్‌సింబన్ అను జపాను పత్రిక 28 వ తేదిన వ్రాసినది.

దక్షిణ చైనాలో షింగ్సువాన్ రేవును కొన్ని నెలలుగా ఆక్రమించియున్న జపాను నావికులు అచటి రహదారి సౌకర్యముల శిథిలపరచి, 26 వ తేది నా రేవును ఖాళీచేసి మరలి వెళ్లిరి. జపాను విమానములు 29 వ తేదిన చుంకింగుపై తీవ్రముగు విమానదాడి జరిపెను. అపుడు అచటనున్న బ్రిటిషు రాయబారి కార్యాలయముపై రెండు బాంబులు పడెను. కార్యాలయము శిథిలమయ్యెను. ఉద్యోగులలో కొందరుకు గాయములయ్యెను.

జపాను మంత్రివర్గము జూలై 1 వ తేదిన జపాను చక్రవర్తి అధ్యక్షతను సమావేశమై జర్మను రష్యా సంగ్రామము పట్ల తమ వైఖరిని నిర్ణయించుకొనిరి. ప్రధాన మంత్రి కొనాయిగారును, విదేశాంగ మంత్రి మట్సుకాగారును 2 వ తేదిన తమ విధానమును ప్రకటించిరి.

చైనాయందు జపానుచే నాంకింగునం దేర్పరుపబడిన "కీలుబొమ్మ" ప్రభుత్వమును జర్మనీ, ఇటలీ, స్పెయిను, హంగరీ, ప్రభుత్వములంగీకరించెను.

### నౌకానష్టము.

27 వ తేదిన ఇంగ్లీషు ఛానలులో శత్రుల సరకుల నౌక యొకటి ప్రయాణముచేయుచుండ బ్రిటిషు విమానము దీని నెదిర్చి ముంచివేసినది. అట్లాంటికు సముద్రంలో 28 వ తేదిన యుస్పరేటక్ అను జర్మను నౌకను బ్రిటిషు నౌకలు పట్టుకొని, దానిలో గల 80 బ్రిటిషు ఖైదీలను విడచి పెట్టించిరి. మార్సడక్ అను బ్రిటిషు నౌక అమెరికానుండి సరకులను కొందరు అమెరికను సైనికాధికారులను ప్రయాణీకులను యెక్కించుకొనివచ్చుచుండగా 26 వ తేదిన అట్లాంటిక్ సముద్రములో శత్రుచర్యచే ముంచివేయబడెను. ఒక డచ్చి జలాంతర్గామి 26 వ తేదిన 7 000 టన్నుల నూనె నౌకను 5,000 టన్నుల సప్లై నౌకను ముంచివేసెను.

### ఇటలీ.

ఇటలీలో శత్రుదేశములనుండి ప్రసరింపజేయబడు రేడియో వార్తల వినువారికి విధింపబడు శిక్షలను మూడు రెట్లు హెచ్చించుచు ఇటాలియను అధికారులు ఉత్తరువు గావించిరి.

---

# రషియాలో యుద్ధం

## విమానాలు, టాంకులు తీవ్రంగా పోరాడుట.

ఆధునిక యుద్ధ పద్ధతులయందు సరిసమానంగా తరిఫీదయిన రెండు పెద్ద సైన్యాలు రషియాలో అతితీవ్రంగా పోరాడుచున్నాయి విమానాలు, టాంకులు (ఫిరంగి మోటారులు), ఫిరంగులు, సైనికులు ఢీకొన్నవి. 1,500 మైళ్ల పొడవున యుద్ధరంగం వ్యాపించియున్నది. అందుచే ఉభయ పక్షములవారు ప్రకటించు వార్తలు పరస్పర విరుద్ధంగా ఉండుట సహజం. దాడివచ్చిన శత్రువును ప్రతి అంగుళం మేరను రషియను సేనలు ఎదుర్కొనుచున్నవి. జర్మను సైనికాధికారులు అతినిదానంగా అనవసరమయిన ఆశలు పెట్టుకోకుండా పరిస్థితులను గమనిస్తున్నారని బెర్లిను వార్త తెల్పుచున్నది.

### నాల్గు ముఖ్య యుద్ధ రంగాలు.

రషియాపై దాడియందు జర్మను సేనలు నాల్గు స్థానములను ఆక్రమింప నుద్దేశించినవి :—(1) లెనిన్‌గ్రాడు నగరం—ఉత్తరమున క్రోన్‌స్టాటు నౌకాదళ కేంద్రంతో కలసియుంది, (2) మాస్కో నగరం—రషియా ముఖ్యపట్నం దేశానికి నాభిస్థానం వంటిది, (3) కీవ్—గోధుమపంటకు ప్రసిద్ధిచెందిన యుక్రైను రాష్ట్ర ముఖ్యపట్నం, (4) నల్లసముద్రతీరమునందున్న ఒడెస్స. అది వశమయినచో బాకునుండి వచ్చు చమురుగొట్టాముల చివరనున్న బాటుం రేవు స్థలంకూడ వశపరచుకొనుట సులభమగును. దక్షిణమున జర్మను సేనలతో కలసి రుమేనియా హంగేరీ సేనలు గూడ బలవంతాన యుద్ధం చేయుచున్నప్పటికి కీవు వైపుగాని, ఒడెస్సావరకుగాని రాజాలకపోయినవి. జర్మనులు నిర్లక్ష్యంగా యుద్ధరంగంలోనికి అనేక టాంకులను పంపుచున్నారు. అవి కార్పేతియా కొండలను ఎగుడు దిగుడు నేలలనుగాని బగ్, ప్రూతు, నీయస్టరు పెద్ద నదులనుగాని సులభంగా దాటలేకుండా ఉన్నాయి. అందుకు అట్టే ముందుకి పోజాలకున్నాయి. రషియా సేనలో పెద్దది బలమైనది దక్షిణమునందే యుంచబడ్డది. ఏమంటే, అచటి గోధుమపంట, చమురుగనులపైనే హిట్లరు దృష్టిగలదు.

### రషియనుల తిరుగు దాడి.

లోవు (లెంబర్గు) నగరంనుండి దక్షిణమున నల్లసముద్రం వరకు నాజి దాడిని రషియనులు అరికట్టిరి. బ్రెస్టులిటోవిస్కును మున్ముందే వశపరచుకొని, యిటీవలనే గ్రోడ్నో వశపరచుకొన్నను లాభంలేకపోయింది. చమురుకొరకు జరిగే యుద్ధంలో రషియనులుగూడ తమవంతు దెబ్బవేసిరి. రష్యా విమానాలు రుమేనియా ముఖ్యపట్నముపై బాంబులువేసి అచటి ప్రభుత్వమును మరోచోటికి తరిమివేయుటేకాక ప్లోయెష్టియందున్న చమురుగనులను కాల్చివేసినవి; జర్మనీకిపోనున్న చమురుపడవలను రుమేనియా రేవుస్థలమగు కాన్‌స్టెంజాయందు రషియనుబాంబులు తగులబెట్టినవి. బాల్కను రాజ్యములు జర్మనుల వశమయిన తరువాత ఇంగ్లాండుపై దాడి సలుపుటకు తగినంత చమురు సప్లై జర్మనీకి గలదంటారు. నల్లసముద్రంనుండి విడియాటికు సముద్రం కొనను గ్రీసులోనున్న ట్రియస్టా రేవువరకు రస్తా ఏర్పడినందున జర్మనులకు 30 లక్షల టన్నుల చమురు లభించగలదు. అంతేకాక యితర దేశాలనుండి తత్తుల్యమగు సరకు 110 లక్షల టన్నులు చేకూరును. కాని రషియాలోని కాకసను చమురు గనులు వశపరచుకొన్నచో సాలీన 300 లక్షల టన్నుల చమురు లభింపగలదు. అయితే యీ గనులను చెడగొట్టకుండా రషియా యథాతథంగా శత్రువులకు విడచిపెట్టునా? అవి చెడగొట్టబడినచో బాగుచేసుకొనుటకు ఏడాది పట్టును. ఈలోగా రుమేనియా చమురు గనులు చెడకుండా యుండుట జర్మనీకి ఎంతో అవసరం. అవి యున్నచోట్ల రషియనులు నిరంతరం బాంబులువేయుచున్నారు. ఇవిగాని చెడిపోయినచో జర్మనులు రషియాలో ఏమి గెలువదలచిరో అంతయు యిచట గోల్పోయెదరు.

ఉత్తర రంగమునందు నేల సదునుగ నుండును. కావున జర్మనుల కనుకూలంగా నుండును. రషియా సేనగూడ అచట కొంచెం నీరసగ నుంది. లెనిన్‌గ్రాడును జర్మనులు బెదరించుచున్నారు ; లిథూనియా ముఖ్యమగు కౌనాసును, లాట్వియా ముఖ్యపట్నమగు రీగాను జర్మనులు వశపరచుకొనిరి. ఆర్కిటికు సముద్రతీరమునకు పోయిన జర్మను సేనలకు రషియాపై యుద్ధం ప్రకటించిన ఫిన్లాండు తోడ్పడుచున్నది. నార్వేనుండి ఫిన్లండుకు జర్మను సేనలు తమ దేశం మీదుగ పోవుటకు మధ్యనున్న స్వీడను అంగీకరించెను. లెనిన్‌గ్రాడుపై జర్మనులు విమాన దాడి సలిపినందుకు బదులుగ, రషియను విమానాలు ఫిన్లండు ముఖ్యపట్నమగు హెల్సింకి నగరంపై దాడి సలిపినవి. లెనిన్‌గ్రాడు శత్రువశమయినచో రషియను బాల్టికు నౌకాదళం లొంగిపోయినట్లే. కావున రషియా లెనిన్‌గ్రాడును కాపాడుటయందు ఎక్కువ శ్రద్ధ వహించును.

### మిన్‌స్కు యుద్ధరంగం.

లిథూనియా రాష్ట్రంయొక్క పూర్వ ముఖ్యపట్నమగు విల్నాను వశపరచుకొన్న జర్మను సేనలు విటెబ్స్కు, స్మోలెన్‌స్కు, మాస్కో నగరములవైపుకి వచ్చుచున్నవి. మొత్తంమైన

200 మైళ్లు ముందునకు వచ్చినవి. జర్మనుల ఆయుధ మోటారు దళమొకటి మిన్‌స్కు వైపు ముందునకు త్రోసుకొనివచ్చినది కాని అంతమాత్రమున రషియను రక్షణశ్రేణి చెదరినట్లు లేదు. రషియనులు తిరుగు దాడిసలిపి శిక్షించిరి. ముందువచ్చిన టాంకు దళమును, మూలశిబిరంలోనున్న సైన్యానికి కలుపనెంచుచున్న కాల్బలముతో తీవ్రయుద్ధము కొనసాగుచున్నదనియు, చాల నష్టపరచితిమనియు రషియనులు ప్రకటించిరి.

మాస్కో నగరంపై తీవ్రమగు దాడిసలిపి యుద్ధఫలితం తేల్చాలని జర్మనులు ప్రయత్నింపవచ్చును. అందుకని రషియనులు ప్రక్కబలంగా నుంచుకున్న సైనికదళములపై అకస్మాత్తుగ జర్మనులు దాడి సలుపవచ్చును. మిన్‌స్కుపై దాడికిదే వుద్దేశం. అచట 4,000 టాంకులు పోరాడుచున్నవి. కీవు జిల్లాలో తీవ్రయుద్ధంకూడ యిందు నిమిత్తమే.

రషియను సేనలు యింతవరకు బాగానే పోరుచున్నవి. కాని వారి విమానాలు జర్మను సైన్యాలు వెనుకకుపోయి బాంబులు వేయుట ఎక్కువగ జరుగనందున మంచి ఫలితం చేకూరలేదు. భూమిపైనున్న భవనములపైగాని, యంత్రాలపైగాని బాంబులు వేయునపుడు అవి బరువైనవి వెంటనే నాశనం చేయునట్టివిగా నుండవలెను. అయినా జర్మనుల ప్రకటన పూర్తిగ నిజమనుకోడానికి వీలులేదు. ఈ ప్రకటన చేస్తాం, చేస్తాం అంటూ, వారం రోజులు ఆలశ్యంగా ప్రకటించేరు. తమవి 150 విమానాలు పోగా రషియావి 4,000 పోయినాయని, రషియా టాంకులు 2,233 పోయినాయని చెప్పేరు. 40,000 మంది ఖైదీలు పట్టుబడ్డారన్నారు. జర్మను సబుమెరైనులు, నౌకలు రషియా నౌకాదళంపై యుద్ధం చేసినవనియు, బాల్టికు తూర్పు సముద్రంలోమందుగని తగిలి ఒక రషియను యుద్ధ నౌక మునిగిందనియు, మాగ్జింగోర్కియను క్రూయిజరు చెడినదనియు ప్రకటించేరు. ఒక జర్మను సబుమెరైను రెండు రషియా సబుమెరైనులను చెడగొట్టింది. జర్మను మోటారు టార్పెడో పడవలు రెండు యుద్ధనౌకలను, ఒక జలాంతర్గామిని ముంచినవి. కార్ల్‌స్టెంజారేవుపై దాడివచ్చిన రెండు రషియను యుద్ధనౌకలు తీరపు ఫిరంగులచే తరిమివేయబడినవి. కొంచెం సేపట్లో ఒకటి ప్రేలిపోయింది, ఇంకోటి పారిపోయింది. ఇట్లా ప్రకటించిన జర్మను ప్రకటనలో యథార్థం తెలియడానికి రషియా ప్రకటనలు చదవాలి. నల్లసముద్రంలోను, రీగా చేరువను నౌకలను నష్టపోవుటేగాక, జర్మనులు వందలకొలది విమానాలు వేలకొలది టాంకులను నష్టపడిరని వారు తెలిపిరి.

రషియా అధ్యక్షుడగు స్టాలిను 3 వ తేదీన తమ ప్రజలను హెచ్చరిస్తు చేసిన ప్రకటనలో లితూనియా, లాట్వియాలో చాలా భాగం, వైటురష్యా పశ్చిమ భాగం, యుక్రేను పశ్చిమ భాగం కొంతవరకు జర్మనులాక్రమించిరని తెలిపిరి. కొన్ని నగరాలలో రష్యను సేనలు లొంగిపోవలసివచ్చెననికూడా చెప్పిరి. కాని వెనుక నెపోలియనువలె యిపుడు హిట్లరు కూడా ఓడిపోవుననిరి.

---

# జపాను భయం.

## రష్యా - జర్మనీ యుద్ధం ఏమగునో ?

## తమకు సంబంధం లేనట్లు ఊరుకోజాలదు.

రష్యా - జర్మనీ యుద్ధం గత నెల 22 వ తేదీన ప్రారంభం కాగా, యీ నెల 2 వ తేదివరకు జపాను తన వైఖరి నిర్ణయించుకొన జాలక పోయెను. అపుడైన స్పష్టంగా ఏమి చేయదలచెనో చెప్పలేదు. చక్రవర్తి అధ్యక్షతను జపాను సామ్రాజ్య సభ జరిగిన పిదప విదేశాంగ మంత్రి మట్సుఓకాగారి ప్రకటనలో "జపాను తయారుగానుండి శ్రద్ధగ యుద్ధ పరిస్థితులను పరికించుచుండును" అని చెప్పిరి. జర్మనీ-రష్యా యుద్ధం ఆ రెండు దేశాలకే సంబంధించినదని ఊరుకో జాలమని కూడా అనిరి. జపాను యితరులను అనుకరింపక తలచినపని చేసి తీరునని ప్రధాని కోనాయిగారు సూచించిరి. జపాను అధికార రీత్యా గావించిన యీ ప్రకటనకు పూర్వమే జర్మను, ఇటలీ రాజ్యాలు నాంకింగులో జపాను ప్రతిష్ఠించిన బూటకం ప్రభుత్వమును గుర్తించుచు ప్రకటించేయి. ఇది జపాను కోరిక పైనే జరిగియుంటే యిందుకు బదులుగ జర్మనీకోర్కెను జపాను మన్నించవలసియుండును.

జపాను చాల ఆందోళన పడుచున్నదనుటకు ఎన్నో నిదర్శనములు గలవు. అనుదినం మంత్రుల సమావేశములు, ప్రిన్సు కోనాయిప్రధాని చక్రవర్తిని తరుచుచూచుట, పత్రికా విలేఖరుల సభ యందు ప్రశ్నలకు అందకుండా జవాబులు చెప్పుట జరుగుచుండెను. జపాను రేడియో ప్రకటనలు జర్మనీ కనుకూలంగా లేవు. హిట్లరు రషియాపైబడుట జపానుకి ఎక్కువ భయంగా ఉందనియు, అది మిత్రమండలితో చేరినా చేరవచ్చునియు అమెరికాకు వార్తవచ్చెను; లండనులోనున్న జపాను ప్రముఖుడొకడు అది నిజమనెను. హిట్లరు విషయమున యింతవరకుగల భ్రమ తొలగిందో లేదో కాని యీ యుద్ధం ప్రారంభం నుండియు జపాను పత్రికలు "జపాను ప్రపంచ శాంతినే కోరుచున్నది. తూర్పు ఆశియా ఖండమున నూతన వ్యవస్థ స్థాపింప స్థిరనిశ్చయం చేసుకుంది" అని వ్రాస్తూనే ఉన్నాయి. రష్యా రాజ్య భాగములను తమ సైనిక శిబిరాలుగా ఇంగ్లాండు అమెరికా ఉపయోగించినచో జపాను రక్షణకు ముప్పు కలుగునని భయంకూడా గలదు. అట్టి భయం ఉండబట్టే జపాను దోపిడి చేసే బుద్ధి తగ్గి, దక్షిణదాడి నిలిపియుంచునుగాని, జర్మనితో చేరి రషియాకు హాని కలిగించాలని తొందరపడదు.

గత సెప్టెంబరు మాసంలో జపాను అక్షరాజ్యాలతో (జర్మనీ ఇటలీలు) ఒడంబడిక సంతకంచేసింది. ఇపుడున్న యూరోపుయుద్ధం చీనా యుద్ధములందు నిమగ్నం కాకుండా ఉన్న దేశా లేవయినా, యీ ఒడంబడిక సంతకంచేసిన మూడు రాజ్యాలలో దేనిపై పడినా తక్కిన రెండు ఆ మూడో రాజ్యానికి సహాయంగా యుద్ధానికి దిగవలెనని ఆ ఒడంబడికలో గలదు. ఏప్రిలు 13 వ తేదీన, జపాను రష్యాతో ప్రత్యేకంగా ఒక ఒడంబడిక చేసుకుంది: "ఈ రెండు రాజ్యాలలో దేనిపైన యితర దేశాలేవయిన యుద్ధానికి వస్తే, రెండోది ఆ యుద్ధకాలమునందు తటస్థంగా ఉండును" అని ఇందు కలదు. ఇపుడు జపాను ఏమిచేయును? వెంటనే ఏమి నిర్ణయం చేయక, వేచియుండగలదు.

### దూరప్రాచ్యంలో.

డచ్చి తూర్పు దీవులలో పరిస్థితులెట్లున్నవి? ఈ దేశంతో జపాను ప్రారంభించిన రాయబారాలు తెగిపోవడంచేత అనేక ఊహలకు అవకాశంగలదు. అకస్మాత్తుగా రాయ

ఖారాలు నిలచిపోవుట జర్మనీ ఒత్తిడినుండే అని కొందరంటున్నారు. జపానులో అతివాదవర్గంవారు యీ చర్చలు మానమని ప్రభుత్వాన్ని ఒత్తిడి చేసియుండవచ్చును. రషియా-జర్మనీ యుద్ధం వచ్చినందున పరిస్థితులు మారినవి. తూర్పు దీవులపై జపాను దాడి వెడలినచో ఇంగ్లాండు డచ్చి దీవులకు తోడుగా పోవునని జపానులో పెద్దలు గుర్తించియుందురు. "అన్యోన్య సంపదాభివృద్ధివర్గము"నందు చేరుమని జాపాను తూర్పు దేశాలన్నిటిని కోరుచున్నది. కాని తానే నాకత్వము వహింపగోరుచున్నది. అన్యోన్యతకు ముఖ్యం ఆర్థిక సఖ్యతయనియు, ఒకరుయింకొకరికన్న పెద్దలు, ఎక్కువవారన్న భావం ఉండరాదను విషయం జాపాను మరచిపోతున్నది. జర్మనీకి సరకు సప్లయి అధికంచేయు ఒడంబడికదేనికీ తామంగీకరించమని డచ్చి తూర్పు దీవుల ప్రభుత్వం స్పష్టంగా తెలిపింది. అందుచే యిపుడు ఊరుకోడం మంచిదని జపాను తెలుసుకుంది. అయినా జపానులో మితవాద పత్రికయొకటి జర్మను దురాశలగూర్చి విమర్శిస్తు "ఇండియా, ఆస్ట్రేలియా, ఇరాను, ఇరాకు, సావుడి అరేబియా. ఉరల్ పర్వతాలకు తూర్పున ఉన్న రషియా ప్రాంతాలన్నిటిపై జపాను యజమాన్యమును జర్మనీ ఏల అంగీకరింపరాదు" అని ప్రశ్నించుట వింతగనున్నది. ఆశియా ఖండంలో ఉన్న రషియా నాక్రమించాలను జర్మను ఆశలగాంచి జపాను భయపడుచున్నదని దీనిబట్టి తెలియగలదు.

## ప్రాచ్య దేశాలకు ముప్పు.

రషియాపై జర్మనుదాడి ఇండియాకు యదార్థమును తెలియజేయుచున్నది. నియంతలపాలన క్రిందనున్న యీ రెండు దేశాల తత్వాలు వేరని భారతీయులకు తెలుసు. జర్మనీలోని నేషనలు సోషలిస్టు పార్టీ చేసినన్ని ఘోరాన్యాయాలు, మతవిరుద్ధ కార్యాలు అమానుషత్వం అధికారంలో ఉన్నపార్టీ యింకొకటేది యేదేశంలోను చేయదని గుర్తించిరి. మధ్యప్రాచ్య దేశములందు యుద్ధంలో రషియా ఎట్టి జోక్యం కలిగించుకొనక తన హద్దులలోనే యుండెను. జర్మనీ అధికారంవస్తే తమ దేశాలు నిర్దాక్షిణ్యంగా దోచబడునని ఆదేశాలెరుంగును. జర్మను సైన్యాలకు అడ్డులేదు, అవి అజేయములని ఒక వదంతి గలదు. కాని ఇంగ్లాండును ఓడించుట కష్టమని తెలుసుకొని, మధ్య పాచ్యమున బాగా దెబ్బతిన్న పిమ్మటనే జర్మనీ రషియాపై దాడి ప్రారంభించిందని మరచిపోరాదు. దురదృష్ట వశాత్తు రషియా జర్మనీని ఓడించలేక పోతేకూడా (అట్లు జరుగనేరదు) నాజీలు చాల సైన్యమును యుద్ధ సామగ్రిని గోల్పోయి చివరకు చాల బలక్షీణమగుదురు. చమురుగనులు మసివ్మైతె, పెద్ద స్కీము అమలు జరిపితేగాని చమురు, యితర వస్తువుల సప్లై చాలదు. ఈ పునరుద్ధరణ కార్యమునకు జర్మనీ తీసుకొను గడువులో, ఇంగ్లాండు అమెరికా సహాయమును పూర్తిగపొంది దేశ రక్షణ యేర్పాటులు దిట్టపరచుకొనుటకు మంచి అవకాశ మేర్పడును. కొంత కాలానికి రష్యా ఓడిపోతే జర్మనీ యింకా తూర్పునకు, దక్షిణానికి చొచ్చుకపోగలదు. అందువలన జర్మనీ శక్తి మరింత తగ్గిపోయి, జర్మనులు కలగంటున్న బ్రిటనుపై విజయం మరింతదూరమగును.

## అమెరికా సహాయం : నాక్సుగారి ఉపన్యాసము.

అమెరికా నౌకాదళ కార్యదర్శి కర్నలు నాక్సుగారు మరో గంభీరోపన్యాసము నొసంగిరి. "అట్లాంటికు సముద్రంలో జర్మనీ స్పృక్కులేకుండా తరిమివేయుటకిదే సమయం. ఇపుడే దెబ్బకొట్టాలి" అని వారనిరి. నేటి యుద్ధ ఫలితమును తేల్చుటకు అనుకూలంగా యీ జర్మను-రష్యా యుద్ధమును దేవుడు తెచ్చిపెట్టేడని అతడనెను. "అమెరికా తనకుగల ప్రమాదమును గుర్తించి, తాను చేయవలసిన త్యాగమెంతో తెలుసుకోవాలి. బ్రిటిషువారితో సరిసమానంగా కంటతడిపెట్టి, చెమటూడ్చి, రక్తం ధారపోసి, నాగరిక ప్రపంచమంతకు నాజీ శక్తి వ్యాపించకుండా అరికట్టాలి."

బ్రిటిషువారి నౌకా నష్టములగూర్చి నాక్సుగారు తెలిపిన సంఖ్యలుచూస్తే, యుద్ధ నౌకలు, మర ఫిరంగులు, మందుగుండును ఇంగ్లాండు అమెరికాలు అధినివేశ రాజ్యములు ఎక్కువగ తయారు చేయుటకెంత కష్టపడవాలో తెలియగలదు. "ఈ నష్టాలు కొనసాగనిచ్చినచో దీనికంతా ఒకటే అంతం గలదు.—హిట్లరు విజయమొందినచో ప్రపంచమంతటిపై అధికారం చెలాయిస్తాడు." అందుకే అట్లాంటికు సముద్రంనుండి జర్మనీ ముప్పు తొలగించుటకు అమెరికా నౌకాదళమును ఉపయోగించుట మరింత అవసరమగుచున్నదనిరి. నాక్సుగారి యీ ప్రకటన రూజువెల్టుగారు తలపెట్టిన ఘనమగు సహాయ కార్యములకు అంకురార్పణగ ఎంచబడుచున్నది.

---

# సిరియాలో విజయ పరంపర

సిరియాలో డామస్కసునగరం పట్టుబడిన తరువాత, వెంటనే వుత్తరమునవున్న ముఖ్యపట్నమగు హోమ్సుపై మిత్రమండలి దాడి ప్రారంభమైనది. ముందు సైడ్నియా తరువాత నెబ్రుకు బ్రిటిషువారి వశమైనవి. నెబ్రుకు డామస్కసునకు ఈశాన్యంగా 35 మైళ్ల దూరంలో వుంది. అక్కడికి హోమ్సు అంతేదూరం. విషీ సేనలు సముద్ర తీరాన ఎదురు తిరుగుచున్నవి. కాని మిత్రమండలి సేన నెమ్మదిగ ముందుకు పోతున్నది. బైరూటుపై యీవారం రాయలు విమానాలు రెండు తీవ్రమగు దాడులు సలిపి, ఎదురుతిరుగుతే ఏమగునో బైరూటువాసులకు చవిచూపేయి. బ్రిటిషు సేనలు పాల్మైరా నగరం చుట్టే ముట్టయి. అది లొంగిపోక తప్పదు.

సిరియా ప్రజలు విషీ సేనలు మరలిపోవాలని కోరుచు, తరుచు తిరుగుబాటు చేయుచున్నారు. ఈజిప్టుకున్న స్వాతంత్ర్యం సిరియా ప్రజల కిస్తామని బ్రిటిషువారు వాగ్దానం చేసేరు. సిరియా ప్రభుత్వోద్యోగులను యథాప్రకారం పనులు కొనసాగించమని ప్రోత్సాహంచేసేరు. మిత్రమండలి వారి ప్రకటనలను అమలు జరుపుటకుగాను, ఆ సిరియాను ఆక్రమించిన సేనలకును సిరియా ప్రభుత్వమునకు ఎక్కువ అన్యోన్యత యుండునట్లు చర్చా సంపర్కము ఏర్పాటు చేయబడును. భావి స్థితిపైగూడ చర్చలు జరుగును. సిరియా నంతను ఆక్రమించి ఫ్రెంచి మాండేటరీనుండి తప్పించిన పిమ్మట ప్రజలే సర్వాధికారం వహించి యిష్టంవచ్చిన రాజ్యాంగ విధానం నిర్ణయించుకొనుట కంగీకరించుచు ఒడం

బడిక చేసుకుంటామని జనరలు కాట్రౌక్సుగారు (స్వతంత్ర ఫ్రెంచి సేనాని) సిరియా ప్రధానికి ఉత్తరం వ్రాసెను.

అదివరకు మంత్రిగనుండిన కేప్టను ఆలివరు లిటిలుటానుగారు, మధ్య ప్రాచ్యమునందు బ్రిటిషు మంత్రివర్గ ప్రతినిధిగా నియమింపబడిరి. ఈతడు కైరో నగరంలో స్థావరంగా నుండి, మధ్యప్రాచ్య సేనాధిపతికి రాజకీయ పరిపాలనా బాధ్యతలను తొలగించి ఆ పనులను తాను నిర్వహించుచుండును. ఆక్రమిత ప్రాంతాల పరిపాలనాకార్యం, ప్రచారకార్యము, స్వతంత్ర ఫ్రెంచి రాజ్యము అబిసీనియా చక్రవర్తులతో సంప్రదింపులును చేయుచుండును. ఇదివరకు యీ కార్యభారమంతా సర్ ఆర్చిబాల్డు వావెలు సేనాని పైనుండెను. పని చాల ఎక్కువైనందున వీరు ఇండియా సేనాధిపతిగావచ్చి, ఇక్కడనున్న సేనాధిపతి సర్ క్లాడు అచినలెకుగారు మధ్యప్రాచ్య దేశ సేనాధిపతిగ పోయిరి.

## ఇటలీ పరాజితులు మరికొందరు

అబిసీనియాలో యింకా కొందరు ఇటలీ సేనానాయకులు మిగిలియున్నట్లున్నారు. ప్రాత సేనానాయకుని వరువడి ననుసరించి వారును బ్రిటిషువారికి లొంగిపోవుచున్నారు. జనరలు కార్టిలోన్గారు సోమలిలాండులో ఇటలీ సేనానాయకుడు, చించిన్నాక్రమించిన బ్రిటిషు సేనకు వశమయ్యెను. వానితోబాటు ఒక ఇటాలియను బ్రిగేడియరు, 245 ఉద్యోగులు, 1,941 సైనికులు, 841 అస్కారీలు ఖైదీలుగ పట్టుబడిరి. బ్రిటిషువారిపుడు అబిసీనియా అంతకు యజమానులుగా నున్నారు. ముసోలినికి అన్యాయార్జిత సామ్రాజ్యమును వదిలించిన కీర్తి జనరలు వావెలు కన్నింగుహాముగార్లకు దక్కినది.

లిబియాలో మార్పేమి లేదు. కాని రాయలు విమాన దళం కాపలాకాస్తునే ఉంది. బెంఘాజి, ట్రిపొలిలపై దాడి చేసి చాల శత్రునౌకలను నాశనంచేసినవి. రషియాలో జర్మనీ చేతినిండా పని కల్పించుకొన్నందున, సిరనైకాయందు మనం ముందంజవేసి శత్రునాశనం చేయాలని సైనిక విలేఖరులు తెల్పుచున్నారు.

సలహా: ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల డైరెక్టరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.